## సంగీతంలో మానవతా పరిమళం

గరిమెళ్ళ బాలకృష్ణ ప్రసాద్




ఆయన గానం వెన్నెల ప్రవాహం. మాట మృదుమధురం. ఆయన అన్నమయ్య పదం పాడితే ఆ వేంకటేశ్వరుడు నడుచుకుంటూ వస్తాడనిపిస్తుంది. 5 దశాబ్దాలుగా శాస్త్రీయ, లలిత సంగీతాల్లో ఎన్నో అద్భుతాలు చేస్తున్న గరిమెళ్ళ బాలకృష్ణ ప్రసాద్ సంగీత ప్రియులకు చిరపరిచితులు. పలు కీర్తనలు రచించడంతో పాటు అణిముత్యాల వంటి వందలాది అన్నమయ్య కీర్తనలకు స్వరాలు కూర్చిన విద్వత్తు ఆయన సొంతం. సంగీతం మనిషిలో మానవత్వాన్ని నింపుతుంది.. జీవితాన్ని పరిపూర్ణం చేస్తుందంటున్న గరిమెళ్ళ బాలకృష్ణ ప్రసాద్.

సంగీత సామ్రాజ్ఞికి ఐదు దశాబ్దాలుగా స్వరనీరాజనాలు సమర్పించగలగడం నిజంగా నా అదృష్టం. పూర్వజన్మ సుకృతం. సినిమా పాటలతో మొదలైన నా సంగీత ప్రయాణం లలిత సంగీతానికి, ఆ తరువాత శాస్త్రీయ సంగీతం వరకు సాగింది. తల్లిదండ్రులు సంగీతంలో నిష్ణాతులు కావడం, ఇంట్లో సంగీత వాతావరణం వుండటం కూడా నా జీవితం రాగరంజితం కావడానికి తోడ్పడింది. చిన్నతనం నుంచీ సంగీతం అంటే ప్రాణం. రేడియోలో మంచి పాట ఏదైనా వస్తుంటే మా అమ్మగారు వాల్యూమ్ పెంచి మరీ ఆ పాట నాకు వినిపించే వారు. అందులోని సాహిత్యం, సంగీత విశేషాలు నాతో చర్చించేవారు. ఆమె మంచి గాయనే కాదు, వయలెన్ విద్వాంసురాలు కూడా. నాన్నగారు గొప్ప వాగ్గేయకారులు. దీంతో

సంగీత బీజాలు చిన్ననాడే నా మనసులో నాటుకున్నాయి. బాల్యం నుంచే మృదంగం నేర్చుకోవడం మొదలు పెట్టాను. చిన్నచిన్న కచేరీల్లో మృదంగం వాయించే వాడిని. వినికిడి జ్ఞానంతో సినిమా పాటలు మాత్రం జోరుగా పాడేవాడిని. వాటితో పాటు అనుక్షణం శాస్త్రీయ సంగీతం వింటూ వుండటంతో ఆ జ్ఞానం కూడా కాస్త అబ్బింది. లలిత గీతాలు కొన్ని అలవోకగా నేర్చుకున్నాను. మా చుట్టాలు, స్నేహితుల ఇళ్లలో ఏ కార్యక్రమం జరిగినా నా చేత పాటలు పాడించడం అనవాయితీ అయిపోయింది. ఒకసారి నాన్నగారు సంగీతం పాఠాలు చెప్పే వాళ్ల ఇంట్లో పెద్ద వేడుక ఏర్పాటు చేశారు. ఎవరో ఒకరి చేత కాసేపు సినిమా పాటల కచ్చేరీ చేయించే బాధ్యతను వాళ్లు మా నాన్నగారికి అప్పగించారు. నేను సినిమా పాటలు బాగానే పాడతానని ఆనోటా ఈ నోటా విన్న నాన్నగారు నువ్వే ఆ కార్యక్రమంలో పాడాలోయ్ అన్నారు. రెండు గంటల పాటు భక్తి పాటలతో పాటు సరదా సినీగీతాలు పాడేశాను. నాకు తెలియకుండానే 16 ఏళ్ల ప్రాయంలో అలా తొలి కచ్చేరీ ఇచ్చాను. లలిత గీతాలు నేను సొంతంగా రాసుకునే వాడిని. ప్రేమ, విరహం, దేశభక్తి, దైవభక్తి రసాలను మేళవించి గీతాలు రచించాను. వాటికి బాణీలు కూడా నేనే కట్టేవాడిని. ఆ సమయంలో ఒక అద్భుతం జరిగింది.

మంగళంపల్లి గానంతో మేలిమలుపు

1964లో ఓ తమిళ సినిమాలో మంగళంపల్లి బాలమురళీకృష్ణగారు అద్భుతంగా పాడిన పాటను విన్నాను. అంతవరకు లలితగానంగా సాగుతున్న నా జీవితంలో అదో కుదుపు. పద్ధతి ప్రకారం శాస్త్రీయ సంగీతం నేర్చుకుంటేనే నా సంగీతం మరింత పదునుతేలుతుందని గ్రహించాను. అనుకున్నదే తడవుగా మా పిన్నమ్మ వరలక్ష్మిగారి దగ్గర కొన్ని వర్ణాలు, 50 వరకు కీర్తనలు నేర్చుకున్నాను. అప్పటికే మృదంగంలో కూడా ప్రవేశం వుండటంతో 1968లో కర్ణాటక గాత్రంలో, మృదంగంలో సంగీతభూషణ్ పరీక్షల్లో పాసయ్యాను. ఎంతకాలం ఇలా ఇంట్లో వాళ్ల దగ్గర నేర్చుకుంటాం. బయట ప్రపంచంలోకి వెళితే మహనీయుల వద్ద సంగీతం నేర్చుకోవచ్చనే ఉదే ్దశ్యంతో ఇంట్లో వాళ్లకు చెప్పాపెట్టకుండా పదిరూపాయలు చేతపట్టుకుని, కట్టుబట్టలతో రైలెక్కాను. అప్రయత్నంగా జిల్లెల్లమూడి అమ్మ చెంతకు చేరాను. నామనసు గ్రహించిన ఆమె ఏమీ మాట్లాడకుండా ఆశ్రయం ఇచ్చారు. నాలుగు రోజుల తరువాత అమ్మ నన్ను పిలిచి, సంగీతం కోసం నీవు వెతుక్కుంటూ వెళ్లడం ఎందుకు.. సంగీతమే నీ దగ్గరకు వస్తుంది. హాయిగా ఇంటికి వెళ్లమని ఆశీర్వదించి పంపారు. అమ్మ చెప్పినట్టే జరిగింది. 1976లో ఆకాశవాణి ప్రొడ్యూసర్ పాలగుమ్మి విశ్వనాథంగారి నుంచి పిలుపు వచ్చింది. అంతకు ముందు నా పాట విని వున్న ఆయన ప్రత్యేక భక్తి రంజనిలో పాడేందుకు నాకు అవకాశం ఇచ్చారు. ఆ కార్యక్రమానికి మహావిద్వాంసులు నేదునూరి కృష్ణమూర్తిగారు దర్శకత్వం వహిస్తున్నారని తెలిసి పొంగిపోయాను. నిజంగా నా జీవితంలో అదో మేలిమలుపు. నా జీవితాన్ని అన్నమయ్య కీర్తనలు, తద్వారా ఆ శ్రీనివాసుడికి అంకితం చేయించే గొప్ప గురువు లభించిన శుభతరుణం అది. భక్తిరంజనిలో పాడిన అన్నమయ్య కీర్తనలు నేదునూరిగారికి బాగా నచ్చాయి. సద్గురువు లభించినప్పుడు వరం అడగకుండా ఎలా వుంటాం. అందుకే అన్నమయ్య సంకీర్తనలు మరిన్ని నేర్చుకోవాలని వుంది. మార్గం ఏమిటని నేదునూరి వారిని అడిగాను. తిరుమల దేవస్థానం వారు అన్నమయ్య పాటల ప్రచారానికి ప్రత్యేకంగా ప్రాజెక్టు ప్రారంభిస్తున్నారు. అందులో చేరమని సూచించారు. అలా సద్గురువు నన్ను వేలుపట్టి

అన్నమయ్య వద్దకు, వేంకటేశ్వరుని సన్నిధికి నడిపించారు. నాటి నుంచి నేటి వరకు అన్నమయ్యతో, శ్రీనివాసునితో ఏర్పడిన అనుబంధమే నన్ను ఈ స్థితికి చేర్చింది. ఆ శ్రీనివాసుడే నా జీవితంలో అడుగడుగునా వెన్నంటి నన్ను నడిపించారు. నా గురువు నేదునూరి కృష్ణమూర్తిగారు, ఆ శ్రీనివాసుడు లేనిదే నా జీవితమే లేదు.



అదో.. సంగీత లోకం

అన్నమయ్య ప్రాజెక్టులో పనిచేస్తున్న రోజుల్లో గురువుగారు చెప్పగా మద్రాసులోనీ మ్యూజిక్ అకాడమీ ఉత్సవాలకు వెళ్లాను. సంగీతాన్ని అభిమానించే ఎవరైనా ఏటా డిసెంబర్‌లో జరిగే ఆ ఉత్సవాలకు వెళ్లి తీరాల్సిందే. సంగీత దిగ్గజాలన్నీ ఒకచోట చేరి ఆ శారదాంబకు స్వరనీరాజనం ఇస్తారు. సంగీత సమరమే జరుగుతుంది అక్కడ. ఆ ఉత్సవాల్లో నా గురువుతో కలిసి పాడే అవకాశం రావడం నిజంగా నా అదృష్టం. మనరాష్ట్రంలో రామదాసు, అన్నమయ్య వంటి మహనీయులు జన్మించినా తమిళనాడు, కర్నాటక రాష్ట్రాల్లో శాస్త్రీయ సంగీతానికి వున్న ఆదరణ అనిర్వచనీయం. ఆ స్థల మహత్యం అలాంటిదేమో? అన్నమాచార్య పాజెక్టులో వున్న కాలంలో దక్షిణాది అంతటా తిరిగి కచేరీలు చేశాను. శ్రోతల్ని జాగ్రత్తగా గమనించే వాడిని. వారు నా పాటను ఎలా ఆస్వాదిస్తున్నారో గ్రహించేవాడిని. శాస్త్రీయతకు ఏమాత్రం లోటు రాకుండా శ్రోతలు మరింత ఆనందించే రీతిలో పాడే వాడిని. అదే నాకు ఇంతటి జనాదరణను తెచ్చిపెట్టిందేమో అనిపిస్తుంది. మామూలు చదువులు చదివి, వచ్చిన ప్రభుత్వ ఉద్యోగంలో కొనసాగి వుంటే ఉన్నత స్థాయికి ఎదిగే వాడినేమో కానీ ఇన్ని లక్షల మంది సంగీత ప్రియుల్ని అలరించే అవకాశం మాత్రం దక్కేది కాదు!

జానకి పిన్నితో కచ్చేరీలు

మా ఇంట్లో శాస్త్రీయ సంగీతంతో పాటు లలిత సంగీతం కూడా కొలువై వుండేది. సినీ నేపథ్యగాయని ఎస్.జానకి నాకు పినతల్లి. 1971లో ఆమె ఇంట్లో ఆరుమాసాల పాటు వున్నాను. ఆమెతో కలిసి రికార్డింగులకు వెళ్లే వాడిని. ఏ పదాన్ని ఎలా భావయుక్తంగా పలకాలి అనే అంశం మీద ఆమె నాకు ఎంతో నేర్పించారు. ఆమెతో కలిసి పలు రికార్డింగులలో కూడా పాల్గొన్నాను. ఆమె నన్ను వాత్సల్యంతో ప్రముఖుల కార్యక్రమాలకు కూడా తీసుకువెళ్లేవారు. ఒకసారి కడపలో బషీర్‌బాబా జయంతి ఉత్సవ సభలో నన్ను కచేరీ చేయమన్నారు జానకిగారు. ఘంటసాల, పి.బి.శ్రీనివాస్‌తో పాటు గొప్ప గొప్ప

సంగీత విద్వాంసులు ఆ కార్యక్రమంలో పాల్గొన్నారు. వారి ఎదుట పాడటం నిజంగా నా భాగ్యం. ఆ తరువాత చిత్తరంజన్, సాయిబాబా, కలగా కృష్ణమోహన్, పాలగుమ్మి విశ్వనాథం వంటి మహనీయులతో కలిసి అనేక లలిత గీతాలు పాడాను. ఎన్నో లలిత గీతాలు రచించి, స్వరపరిచాను.

సంగీతంతో స్పందించే హృదయం

ఎంతో శ్రమించి వందలాది అన్నమయ్య కీర్తనలకు నేను స్వరాలు కూర్చాను. అడుగడుగునా నన్ను వెన్నంటి వుండి నడిపించిన ఆ శ్రీనివాసునికి ఏమిచ్చి రుణం తీర్చుకోగలను. అందుకే నేను స్వరపరచిన కీర్తనలతో ఆయన పాదాలు కడిగే వాడిని. అన్నమాచార్య ప్రాజెక్టువారు వేలాది అన్నమయ్య కీర్తనల్ని సేకరించారు. కొన్ని కాలగర్భంలో కలిసిపోయాయి. నిజానికి పోయిన వాటి గురించి ఆలోచించే కంటే, మనకు అందుబాటులో వున్న కీర్తనల్ని వినాలి, పాడాలి.. ఆస్వాదించాలి. అదే అన్నమయ్యకు నిజమైన నీరాజనం. ఈ కాలంలో చాలా మంది సిడిలు కొంటున్నారు. అలమరాల్లో అందంగా అమర్చుకుంటున్నారు. కానీ ఆ పాటల్లోని మకరందాన్ని ఆస్వాదించలేకపోతున్నారు. సంగీతాన్ని మనసు నిండా ఆస్వాదించగలిగే వారిలో స్పందించే గుణం పెరుగుతుంది. ఆ గుణం వున్న వారిలో మానవత్వం పరిమళిస్తుంది. సంగీతం మనిషిని సన్మార్గంలో నడుపుతుంది. జీవితాన్ని కళాత్మకంగా జీవించేందుకు అవసరమైన రసహృదయాన్ని అందిస్తుంది. అలా సంగీతం మనిషిని పరిపూర్ణంగా తీర్చిదిద్దుతుంది. అందుకే ఎన్ని వృత్తులు, ప్రవృత్తులు చేపట్టినా ప్రతి ఒక్కరూ సంగీతాన్ని ఆస్వాదించాలి. నేను టివి చానళ్ల ద్వారా సంగీత పాఠాలు చెబుతుంటే వేలాది మంది సంగీత విద్యార్థులైపోయారు. మరికొందరు అంతకు ముందు నేర్చుకున్న విషయాలకు మెరుగులు దిద్దుకున్నారు.



వెలుగుబాటలో నడిపించాలి

ఈ కాలంలో సంగీతం నేర్చుకోవాలనే తృష్ణ చిన్నారుల్లో సైతం పెరుగుతున్నది. చిన్నచిన్న పిల్లలు అద్భుతంగా పాడుతున్నారు. అద్భుతమైన స్వరం వున్న చిన్నారులు చాలా మంది వున్నారు. అయితే వారికి వెలుగు బాట చూపించి, సంగీతంలో ఉన్నత స్థానానికి తీసుకువెళ్లే సద్గురువులు కావాలి. సంగీతం గొంతులో నుంచి కాకుండా ఆత్మ నుంచి పలకాలి. గుండె గొంతుకలో నుంచి రాగాలు పలకాలి. సంగీతం నేర్చుకునేందుకు, నేర్పేందుకు కూడా ఇదే మూలసూత్రం. మనం చేప్పే లేదా పాడే కీర్తనలో మనం లీనం అయినప్పుడు గొప్ప సంగీతం పుడుతుంది. స్వర ం నుంచి అమృతగానం వెలువడుతుంది. ఆ గాన మాధుర్యంలో, ఆ వెలుగుల్లో ముందుతరాలను తీర్చిదిద్దాలి. అప్పుడే సంగీతం అజరామరం అవుతుంది. అలాగే పాట పాడే సమయంలో పదాలను పలకడం గొప్ప కళ. పదాలు సరిగా, స్వచ్ఛంగా

పలికినప్పడే పాట పండుతుంది. మనసు నిండుతుంది. ఈ తరం సంగీత సాధకులు, బోధకులు ఈ రెండు అంశాలపై దృష్టి పెట్టడం చాలా అవసరం.

శ్రీనివాస కీర్తనం.. నా భాగ్యం

350కి పైగా కృతులకు స్వరరచన చేయగలనని నా జీవితంలో ఊహించలేదు. ఆ శ్రీనివాసుడే నా వెంట వుండి నన్ను నడిపించారు. ఆ అన్నమయ్యే నా చేత ఈ స్వరయజ్ఞం చేయించారు. ఇది తొలి అదృష్టం అయితే సంగీత నిధులైన తల్లిదండ్రులు దొరకడం నేను చేసుకున్న మరో భాగ్యం. వీటన్నింటికీ మించి నారద సమానుడైన గొప్ప గురువు నేదునూరి కృష్ణమూర్తి రూపంలో లభించడం మరో వరం. నా జీవితానికి సార్థకత చేకూర్చిన మహనీయుడు ఆయన. నా భార్య రాధ సంగీత విద్వాంసురాలు. నాతో కలిసి కచ్చేరీలు చేసింది. మా అబ్బాయిలు పవన కమార్, అనిల కుమార్‌లు సాఫ్ట్‌వేర్ ఉద్యోగాలు చేసుకుంటున్నా నా సంగీత వారసత్వాన్ని నిలబెట్టే రీతిలో కృషి చేస్తున్నారు. అన్నింటికీ రసజ్ఞులైన లక్షలాది మంది ప్రజల ఆదరాభిమానాలు లభించడం మరో అదృష్టం. ఆ స్వామి కృప, ప్రజల అభిమానంతో నా జన్మధన్యమైంది.

రాజమండ్రి నుంచి తిరుమల దాకా

గరిమెళ్ల బాలకృష్ణ ప్రసాద్ నవంబర్ 9, 1948న రాజమండ్రిలో జన్మించారు. తండ్రి నరసింహారావు వాగ్గేయకారులు. కీర్తనలు రచించడంతో పాటు స్వరకర్తగా, సంగీత స్వర సాహిత్య సంపుటి అనే గ్రంథకర్తగా పేరుప్రఖ్యాతులు గడించారు. తల్లి కృష్ణవేణి కర్నాటక సంగీత విద్వాసురాలు. వయలెన్ కళాకారిణి కూడా. బాలకృష్ణ ప్రసాద్‌కు మూడే ళ్ల వయసులో ఆయన కుటుంబం భాగ్యనగరంలోని సీతాఫల్‌మండికి చేరింది. తల్లిదండ్రులే ఆయనకు తొలి గురువులు. ఆయన కుటుంబంలో అందరూ సంగీత కళాకారులే. సినీ నేపథ్య గాయని ఎస్. జానకి బాలకృష్ణ ప్రసాద్‌కు పిన్నమ్మ అవుతారు. ఒకవైపు చదువుకుంటూనే లలిత సంగీత సాధన చేశారు. మృదంగం నేర్చుకున్నారు. ఆయనది మృదుమధురమైన స్వరం కావడంతో బంధువులు, మిత్రుల ఇళ్లలో ఏ వేడుక జరిగినా బాలకృష్ణ ప్రసాద్ పాట వుండాల్సిందే. 16వ ఏట తొలి కచ్చేరీ ఇచ్చారు. పినతల్లి గారి వద్ద కర్ణాటక సంగీతంలో శిక్షణ పొందారు. ఈ లోగా ఆయనకు ప్రభుత్వ ఉద్యోగం వచ్చింది. ఉద్యోగంలో చేరినా ఆయన మనసు మాత్రం సంగీతం మీదే వుండేది. కొన్నాళ్లకు ఆ ఉద్యోగానికి స్వస్తి చెప్పారు. సంగీత సాధన చేస్తూ కాలం గడపారు. 1973లో మరో ఉద్యోగం వచ్చినా అదీ మూన్నాళ్ల ముచ్చటే అయింది. 1976లో ఆకాశవాణిలో పాడేందుకు పాలగుమ్మి విశ్వనాథం నుంచి పిలుపు వచ్చింది. మహావిద్వాంసులు నేదునూరి కృష్ణమూర్తి సారథ్యంలో జరుగుతున్న భక్తిరంజని కార్యక్రమంలో పాల్గొనే అవకాశం రావడం ఆయన జీవితాన్ని మలుపు తిప్పింది. నేదునూరి వారి సారథ్యంలో సంగీతంలో పదునుతేలడం మొదలుపెట్టారు. 1978లో తిరుపతిలో అన్నమయ్య ప్రాజెక్టులో చేరారు. అప్పటి నుంచి 2006 వరకు అన్నమాచార్య ప్రాజెక్టులో పనిచేస్తూ స్పెషల్ గ్రేడ్ ఓకల్ ఆర్టిస్ట్ స్థాయికి ఎదిగారు. ఆ నాలుగు దశాబ్దాల కాలంలో సంగీత రంగంలో అద్భుతాలు చేశారు.

సద్గురువుల సాంగత్యం

గరిమెళ్ల వారికి తల్లిదండ్రులు తొలిగురువులు ఆ పిమ్మట సంగీత కళానిధి నేదునూరి కృష్ణమూర్తి, ప్రొఫెసర్ పశుపతి, డాక్టర్ మంగళంపల్లి బాలమురళీకృష్ణ వంటి మహనీయుల వద్ద శిష్యరికం చేశారు. స్కూలు స్థాయి చదువుతో ఆపేసిన ఆయన ఆ తరువాత డిగ్రీ చేశారు. శాస్త్రీయ సంగీతంలో డిప్లొమా చేశారు. లలిత సంగీతంలో ఆకాశవాణిలో ఎ గ్రేడ్ కళాకారులయ్యారు. కర్ణాటక శాస్త్రీయ సంగీతంలో బి-హయ్యర్ గ్రేడ్ పొందారు.

ఆ సంగీత సేవ.. అనితర సాధ్యం

శాస్త్రీయ, లలిత సంగీతంలో గరిమెళ్ళ బాలకృష్ణ ప్రసాద్ ఎన్నో అద్భుతాలు చేశారు. 5 దశాబ్దాల సుదీర్ఘ సంగీత ప్రయాణంలో ఆయన ఇప్పటి వరకు దేశ విదేశాల్లో 5 వేల కచ్చేరీలు చేశారు. మాజీ రాష్ట్రపతి శంకర్‌దయాళ్ శర్మ వంటి వారు ఆయనను పిలిపించుకుని మరీ పాటలు పాడించుకుని ఆనందించేవారు. 1997లో అమెరికాలో పర్యటించి కేవలం అన్నమయ్య కీర్తనలతో 24 కచ్చేరీలు చేయడం విశేషం. అన్నమయ్య కీర్తనలపై 8 గ్రంథాలు రచించారు. ఆయన రచించి, గానం చేసిన పలు ఆడియో, వీడియో ఆల్బంలు సంగీత అభిమానులను అలరిస్తున్నాయి. సుమారు వెయ్యి అన్నమయ్య కీర్తనలను 200 రాగాల్లో పాడగలగడం గరిమెళ్ళ వారికే సాధ్యం. ఆ కీర్తనల్ని క్లాసికల్, లలిత, జానపద శైలిలో పాడగలగడం మరో విశేషం. విలక్షణ కీర్తనలతో వారం రోజులు ఒకే వేదిక నుంచి సంకీర్తనా యజ్ఞం అనే విలక్షణ కార్యక్రమానికి ఆయన శ్రీకారం చుట్టారు. మన రాష్ట్రంలో ఇప్పటి వరకు అలాంటి 8 యజ్ఞాలు నిర్వహించి రసజ్ఞుల మనసులు దోచుకున్నారు. పలు టెలివిజన్ చానళ్లలో ఆయన కార్యక్రమాలు లక్షలాది మందిని అలరించాయి. తమిళ మ్యూజిక్ నొటేషన్స్‌తో ఆయన రచించిన పుస్తకాన్ని ఎం.ఎస్ సుబ్బలక్ష్మి గారు విడుదల చేశారు.

స్వరరాగ గంగాప్రవాహం

వివిధ దేవతామూర్తుల మీద అనేక కీర్తనల్ని స్వయంగా రచించిన గరిమెళ్ళ వారు భారత సంగీత సీమలో అరుదైన రికార్డు సాధించారు. అలాగే 350కి పైగా అన్నమయ్య కీర్తనలకు ఆయన స్వరాలు అందించారు. ఎంతో శ్రమించి ఆయన స్వరపరచిన ఒకొక్క కీర్తనా ఒక్కో అమృత భాండం. అన్నమయ్య మీద 40, వినాయకుడి గురించి 55, నవగ్రహాల గురించి 9, విష్ణు, శివ, శ్రీలక్ష్మి, పార్వతి, సరస్వతీ దేవతల మీద కీర్తనలు రచించారు. ఆయన రాసిన కీర్తనల్ని డాక్టర్ సి. నారాయణ రెడ్డి వంటి వారు ప్రశంసించడం గమనార్హం. ఆంజనేయ కృతి మణిమాల పేరిట 21 కృతులతో, మ్యూజిక్ నొటేషన్లతో పుస్తకం వెలువరించారు. కర్ణాటక సంగీత ప్రపంచంలో ఇలాంటి విన్యాసం చేయడం ఇదే ప్రథమం. అంతే కాకుండా సుందర రంజని, వాణీప్రియ వంటి 5 కొత్త రాగాలను ఆయన కనుగొన్నారు. ఆయన రచించి, గానం చేసిన కీర్తనల్ని ఆల్ ఇండియా రేడియో, ప్రసారభారతి వారు రికార్డు చేసి, నేషనల్ అర్కీవ్స్‌లో భద్రపరచడం ఆయన పాటకు లభించిన అరుదైన గౌరవంగా చెప్పుకోవచ్చు. ఇక లలిత సంగీత ప్రపంచానికి ఆయన చేసిన సేవ మరువలేనిది. ఇంత వరకు ఆయన 400 లలిత గీతాలు రచించారు. వాటిలో 100 వరకు రికార్డు అయ్యాయి. కృష్ణరవళి పేరిట ఆయన

కృతులను రెండు సంపుటాలుగా ముద్రించారు. ఈ కీర్తనలు భావితరాలకు వెలుగు దివ్వెలుగా నిలుస్తున్నాయి.

**సంగీతంలో మానవతా పరిమళం**




గరిమెళ్ళ బాలకృష్ణ ప్రసాద్

**శ్రీవారి అస్థాన విద్వాంసులు**

తిరుమల తిరుపతి దేవస్థానం వారు గరిమెళ్ళ వారిని 2012లో ఆస్థాన విద్వాంసులుగా నియమించి అరుదైన గౌరవం అందించారు. కంచి పీఠం ఆస్థాన విద్వాసులుగా కూడా ఆయన వ్యవహరిస్తున్నారు. రాష్ట్ర ప్రభుత్వ అవార్డులతో పాటు ఆయన ఇప్పటి వరకు 28 విశిష్ఠ పురస్కారాలు అందుకున్నారు. ఇతర సత్కారాలు, గండపెండేరాలు, స్వర్ణ కంకణ సత్కారాలకు లెక్కేలేదు.

-టి. కుమార్   సెల్:99854 11012